శ్రీశివాయగురవేనమః.

శ్రీసాంబసదాశివో విజయతే.

# మహాదేవమననము

ఇది

శ్రీమత్సర్వోపనిషత్సారభూతసమన్వయవీరశైవ ప్రసిద్ధసిద్ధాంత
ప్రకాశకమును, సద్యోముముక్షుస్వాంతశంకాశూకవిధ్వంసన సమర్థకమును,
దుర్వాదిగర్వపర్వతశతపక్షచ్ఛేదనదక్షదంభోళియును, సర్వవేదాన్తగ్రంథ
శిరోమణియై యాసికబ్రహ్మసూత్రముఖ్యార్థప్రకాశక శ్రీకరమహాభాష్య
సారార్థప్రదీపికయును, శ్రీమదాపస్తంబసూత్రకౌశికసగోత్రపవిత్ర భగవచ్ఛ్రీ
పతిపండితారాధ్య వంశపయోధిసుధాంశుండగు,

పండితారాధ్యస్వామిచే రచియింపబడి

విద్యాశ్రీనందీశ్వరపుత్రశ్రీమల్లికార్జునశాస్త్రిచే లేఖకప్రమాదాదిదోషలేశ
రహితంబుగ బునర్ముద్రితంబై

రెండవకూర్పు 500 ప్రతులు.

గ్రంథిమాణిక్యాంబచే

రాజమహేంద్రవరం

యస్. సన్నీశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు ముద్రింపబడియెం.

1916

వెల 0-3-0 అణాలు.] [పోష్టేజి ప్రత్యేకము.

# పీఠిక.

మహాదేవమననమను నామంబునబరగు నీగ్రంథము శైవోత్కృష్టతను దెలిపి మోక్షసాధనగ్రంథములలో ముఖ్యమైనదిగా పరిగణింపబడుచున్నయది. ఇది 1898 సంవత్సరములో శ్రీ కణ్వమహాముని గోత్రసంభూత బయ్యన్నపుత్రాపర బసవేశ్వరచినసంగయ్యగారి సహాయముచే చెన్ననగరముద్రాక్షరశాలయందచ్చొత్తించబడియె. ఇయ్యది శ్రీపతి పండితారాధ్య స్వామివారిచే రచియింపంబడి తద్భాష్యనందీశ్వరశాస్త్రిచే లేఖక ప్రమాదాదిదోషలేశరహితంబుగ బరిష్కృతంబయ్యె. ప్రస్తుతమున నీగ్రంథములు దొరకమి భక్తవర్యులకు కొంతవాటిల్లునని తలంచి శ్రీలోకారాధ్యులును శైవసభాధ్యక్షులునైన శ్రీముదిగొండ శంకరారాధ్యులవారి యనుమతిని వడసి ముద్రణంబున నావహిల్లిన యచ్చుటచ్చుటిలోపంబుల గొందరుపండితులచే సంస్కరణముగావించి నాస్వంతవిత్తంబున దీని నచ్చొత్తింపబూనితిని. ఇందును బ్రమాదవశంబున బడినస్వల్పదోషంబుల సరకుసేయక చదువరులాదరభావంబు వహింతురుగాక. ఇది వేదాంతగ్రంథములలో ముఖ్యమయి

భక్తవరులచే విశేషముగ నుపయోగింపబడి సుప్రసిద్ధమయిన దగుటచే పునర్ముద్రణం బావశ్యకమని యిట్లొనర్చితిని. ఇందు కుపోద్ఘాతముగా వ్రాసిన నాకమితానందముగూర్చి కృతార్థురాలినిగనొనర్చిన శ్రీ ము. శంకరారాధ్యులవారి శరణములకనేక శరణు లర్పించుచున్నాను.

ఇట్లు

గ్రంథి మాణిక్యాంబ.

శ్రీరస్తు.

శ్రీశివాయ గురవేనమః.

# మహాదేవమననము.

## ప్రథమపరిచ్ఛేదము.

శ్రీశైలేశం మహాదేవం చింతితార్థప్రదాయకం। మూర్తామూర్తప్రపంచైక కారణం ప్రణతోస్మ్యహం॥ శ్రీసచ్చిదానందఘనం మహేశం స్వశక్తియుక్తం చిదచిత్ప్రకాశం। వేదాంతవేద్యం విబుధైకసాధ్యం నమామిసాంబం కలుషాద్రిశంబం॥ శ్రీసిద్ధలింగత్రయంనత్వా ధ్యాత్వాహంపండితత్రయం। సదారాధ్యత్రయంస్మృత్వా తథాచార్యత్రయంభజే॥ వేదవ్యాసంసూత్రకారమగస్త్యంవృత్తికారకం। భాష్యకృత్పండితారాధ్యం శ్రేయసేభూయసేనమః॥ శివస్సత్యంజగత్సత్యం జీవస్సత్యంస్వభావతః। తయోరభేదస్సత్యంహి క్రిమిభ్రమరవత్సదా॥ సర్వవేదాంతసిద్ధాంత సారంసంగృహ్యసాదరం। ప్రవక్ష్యామి మహాదేవ మననామమతావహం। పశుపాశపతిజ్ఞాన కాంక్షిణాంనిర్మలాత్మనాం। భక్తానాంసుఖబోధాయ రచ్యతేహ్యాంధ్రభాషయా॥

సర్వవేదాంతాగమాది సిద్ధాంతసారసంగ్రహుండును

అనాద్యవిద్యావిచ్ఛేదన దక్షశక్తిపాతాదిదీక్షాప్రదానసమర్థుం
డును సర్వపరిపూర్ణసచ్చిదానంద పరశివానుభవానందకందళిత
హృదయారవిందుండును నగు శ్రీపతిపండితారాధ్యభగవత్పా
దాచార్యులసన్నిధికి భక్తపుంగవుండును వైదికవీరశైవోత్త
ముండునునగు మహాదేవారాధ్యుండనుగుదెంచి మహారుద్ర
ముచే షట్త్రింశత్సాష్టాంగ నమస్కారంబులొనరించి శేషత్వ
పారతంత్ర్య కైంకర్యనిష్ఠాగరిష్ఠుండై నిటలతటఘటితాంజలిపు
టుండై బహువిధంబుల స్తుతియించి స్వామీ నాదినేను అను
మాయామోహపాశబద్ధుండనగుటచే జననమరణప్రవాహాత్మ
క సంసారసాగరనిమగ్నుండను పుత్రమిత్రకళత్రవిత్తగృహ
రామక్షేత్రాది విషయాసక్తచిత్తుండనయితి గావున తాపత్ర
యానల సంతప్తుండనై క్షుత్పీడితుండన్నంబును తృష్ణాపీడి
తుండు సలిలంబును గోరుచందంబున నసపునరావర్తేనసపున
రావర్తతే ఇత్యాది శ్రుతిప్రతిపాదిత నిత్యఫలంబగు మోక్షం
బుంగోరి తుచ్ఛంబులగు ధర్మార్థకామంబులు దిరస్కరించి
భవచ్చరణనళినయుగళం బాశ్రయించితింగాన తన్మోక్షసాధ
నంబులగు పతిపశుపాశాత్మకతత్త్వత్రయవివేకంబును జగత్సృ
ష్ట్యాదివిధానంబాదిగాగల సకలతత్త్వరహస్యంబు లుపదేశించి
కృతార్థునంజేయుమనిన శిష్యునిశ్రద్ధాభక్తివివేకంబులకత్యంత
ముదితస్వాంతుండై పండితదేశికుండు చెప్పదొడంగెను ॥ శ్రు॥

యదాతమస్తం నదివానరాత్రి ర్నసన్నచాసచ్ఛివఏవ కేవలః॥
న దేవసౌమ్యేదమగ్రఆసీత్। బ్రహ్మవాఇదమగ్రఆసీత్। ఏకఏవ
నారాయణో ఆసీత్॥ అనియెడిశ్రుతులయందు-సృష్టికంటెపూ
ర్వమునందు-తరంగరహితసముద్రము-నిర్మేఘాకాశముభంగి-
బ్రహ్మాత్మ నారాయణాదిసర్వశబ్దవాచ్యంబగు పరశివతత్వంబు
ప్రకాశించుచుండు-నందు జీవులును తత్కర్మలును వాసనలును
అదృష్టములతోఁగూడా మధుపిష్టమునందు స్వర్ణరేణువులవలె
గుసూలంబునందు ధాన్యంబులుంబోలె శివునియందు భిన్నాభి
న్నరూపమై సత్వరజస్తమోగుణాత్మికమై నివసించియున్న
పాశశక్తియందణగి యుండును. అది రక్తశ్వేత నీలవర్ణతంతు
విశిష్టచిత్రపటమువలెం బ్రకాశించుచుండును. ఆపాశశక్తియే
ప్రకృతియనిన్ని మాయయనిన్ని మహాప్రళయావస్థయనిన్ని ప్రధా
నమనిన్ని మహాసుషుప్తియనిన్ని జెప్పంబడుచున్నది. ఇందుకు
ప్రమాణము॥ శ్రుతిః॥ అజామేకాంలోహితశుక్లకృష్ణాంబహ్వీం
ప్రజాంజనయంతీంసరూపాం॥ అనిచెప్పుచున్నది. ఇట్టి ప్రకృ
తికి ప్రళయమునందు సంకోచమున్ను సృష్టియందువికాసత్వ
మున్ను గలిగియుండును. ఈపాశరూపమగు ప్రకృతితోఁగూడి
ఈశ్వరుఁడు యావత్ప్రపంచమును సృజించెను॥ శ్రు॥ తస్మాద్వా
ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః-ఆకాశాద్వాయుః-వాయో
రగ్నిః-అగ్నేరాపః-అద్భ్యఃపృథివీ-పృథివ్యాఓషధయః- ఓషధీ

భోక్త్యన్నం–అన్నాత్పురుషః–అనే శ్రుతులు చెప్పుచున్నవి. కనుక
నిదియే వైదికసిద్ధాంతము॥ అనిన శిష్యుండిట్లనియె॥ స్వామీ
నిష్కళంనిష్క్రియంశాంతంనిరవద్యంనిరంజనం॥ అశరీరంవావ
సంతం–నమేప్రియాప్రియే–అప్రాణోహ్యమనాశ్శుభ్రః అనియె
డి శ్రుతులయందు పరమేశ్వరుడు నిష్కళుడు నిష్క్రియుడు
నిష్ప్రాణుడు నిర్దేహుడనియు స్పష్టముగా జెప్పబడుచున్నది.
గనుక తాము పరమేశ్వరునియందు జగదుత్పత్తిస్థితిలయ క
ర్తృత్వములు సెప్పితిరి. నిరవయవుడయిన పరమేశ్వరునియం
దు సావయవమైన ప్రపంచ మేలాగునవుట్టెను. ఈప్రపంచ
కల్పనవల్ల స్వామికేమిప్రయోజనము. ప్రయోజనమనుద్దిశ్య న
మందోపి ప్రవర్తతే–అనే న్యాయముగా– వెఱ్ఱివానికైనను
నిష్ప్రయోజనముగా గార్యప్రవృత్తి కలుగనేరదు. పరమేశ్వ
రునికి జగత్కారణత్వమును జెప్పకుంటే ॥శ్రు॥ సోమకామ
యతబహుస్యాం ప్రజాయేయేతి అనియెడి జగత్కారణత్వ
ప్రతిపాదకశ్రుతులకప్రమాణము గలుగును. శ్రుతుల కప్ర
మాణ మొప్పకున్నప్పటికిని అర్థసిద్ధిక్రియాసిద్ధిరూపమై ప్రత్య
క్షముగా బ్రవంచము గానవచ్చుచుండగా మమమాతావం
ధ్యా అనియెడి న్యాయముగా ప్రత్యక్షమగు ప్రపంచములే
దని చెప్పవల్లలేదు. కారణములేని కార్యముండదుగనుక
ఘటపటాదికర్తలగు కులాలతంతువాయాదులలె నీప్రపంచ

కర్త యొకడున్నాడని నిశ్చయింపబడును. కర్తృత్వవిధాయక శ్రుతులచే నిష్క్రియత్వవిధాయక శ్రుతులకౌపచారికత్వ మునసాధించితే అర్థజరతిన్యాయముగా లోకవిరుద్ధమున్ను పర స్పర శ్రుతి బాధలవలన యావచ్ఛ్రుతులకప్రామాణ్యమున్ను స్వతసిద్ధమగును. ఇదియునుంగాక బ్రహ్మాద్వయము నంగీకరిం చితె ఏకమేవాద్వితీయం బ్రహ్మేత్యాదిశ్రుతుల కప్రమాణము వచ్చునుగనుక నీసంశయముల నన్నింటిని నిర్మూలముగనివర్తిం పజేసి సత్యనిత్యతత్వజ్ఞానంబుపదేశింపుడని వేడుకొనిన గురుం డిట్లనియె. ఓయి నీవడిగినప్రశ్నములకు శ్రుత్యుక్త్యనుభవము లచే జెప్పుచున్నారము. సూ॥ లోకవత్తు లీలా కైవల్యం-లోక మునందు సర్వభూమండలాధీశ్వరుడు విలాసార్థముగా నొక కాలమునందు కించి త్కార్యమునందు బ్రవర్తించుటయు మరి యొకకాలమునందు దూష్ణీంభూతుడై యుండుటయెట్లో అట్లే పరశివుడున్ను విలాసమేప్రయోజనముగా బ్రపంచోత్పత్తి లయములనొనర్చి మరియొకసారి నిస్సంకల్పుడై తానొకడే పరిశేషించియుండును గనుక సృష్టివిధాయక శ్రుతులకున్ను నిష్క్రియత్వవిధాయక శ్రుతులకున్ను లీలావస్థా కేవలావస్థా పరములుగా వేదవ్యాసులవారిచే నిర్ణయింపబడినది. ఇదే సత్యమార్గము స్వప్నమునందమూర్తజీవునివలన మూర్తమ మగుగజతురగాది కల్పనయేలాగో అమూర్తమయిన వాయు

ఘృవలన మూర్తమయిన వహ్నియేలాగునజన్యమాయెనో
రూపములేనికాలమువల్ల జీవులకు నానావిధభోగములున్ను
వృక్షములయందు పత్రఫలాద్యుత్పత్తియు నెట్లో అట్లే అమూ
ర్తమయినసర్వపరిపూర్ణపరశివునివల్ల మూర్తామూర్త
ప్రపంచముపుట్టెనని నశిష్యుండు మరలనిట్లనియెను. ఓస్వామీ
పరమేశ్వరుడు విలాసార్థముగానే ప్రపంచసృష్టి జేసెనంటే దేవ
తిర్యఙ్మనుష్యాద్యుత్తమ మధ్యమాధమములుగా సృష్టియుం
డుటయున్ను కొందరు నానాభోగయుక్తులుగానుండుటయున్ను
మరికొందరు అంధత్వాదినానావిధ దుఃఖానుభూతులుగా
నుండుటయు నెందువల్ల నిర్హేతుకముగానే జీవులకు సుఖదుఃఖ
ములు గలుగునంటిరా పరమేశ్వరునికి వైషమ్యనైర్ఘృ
ణ్యాదిదోషంబులు సంభవించు ననిన గురుండిట్లనియె॥ శ్లో॥
జ్ఞాజ్ఞౌ ద్వావజావీశానీశౌ నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం
సన్మూలాస్సౌమ్యమాః ప్రజాః ప్రజాయంతే అనేకశ్రుతులయం
దు జీవులవ్యక్తులు అజులనియుం జెప్పబడుచున్నారు గనుక
తత్కృతకర్మలున్ను అనాదే తత్కర్మసాపేక్షద్వారా లోక
ములో ప్రభువవలె జీవులకు సుఖదుఃఖముల నిచ్చుచుం
డును తదనుకూలములయిన దేవతిర్యఙ్మనుష్యాది
శరీరముల నిచ్చుననిన మరల శిష్యుండిట్లనియె॥
గురువర్య-పూర్వకర్మానుసారముగా సుఖదుఃఖముల నీశ్వరుం

డిమ్పుచుండునని చెప్పితిరి అట్లయితే ఆదిసృష్టియందు జీవులకు గర్మము లేదుగదా ఏహేతువువలన జీవులకు దేవాదిశరీర పరిగ్రహణము సంభవించెననిన గురుండిట్లనియె॥ ఓశిష్యా—ఆదిసృష్టియందు పరమేశ్వరుడు వహ్నినలన విస్ఫులింగములవలెదనవలన నావిర్భవింపజేసిన జీవులకు సుఖానుభూత్యనుకూలదేవతాశరీరముల నిచ్చి స్వాజ్ఞా రూపమయిన వేదశాస్త్రోపదేశముసేసి తదనుకూలముగా బ్రవర్తింపుడని నిర్ణయింపగా తదనంతరము దేవతాశరీరులగు జీవులు స్వేచ్ఛానురూపముగా బ్రవర్తించుటవల్ల సుఖదుఃఖాశ్రయములగు దేవమనుష్యాదిశరీరములను జెందించిసుఖదుఃఖానుభూతిం గలుగజేయుచుండును ఈలాపొందించు మనవాంతరసృష్టియందు రుద్రవిష్ణు బ్రహ్మలను సృజించి జగత్త్రయస్థితిసృష్టులకు గర్తలనుగానొనర్చి ముప్పురిలో గాలరుద్రునకి సృష్టిస్థితిసంహారకర్తృత్వమునున్ను విష్ణువునకు సృష్టిస్థితికర్తృత్వమునున్ను బ్రహ్మకు సృష్టికర్తృత్వమునిచ్చి స్వాజ్ఞారూపములయిన వేదాదుల నుపదేశించి తదనుసరణముగా లోకప్రవర్తన నడిపింపుడని యాజ్ఞాపించిన హేతువుచేతను వారట్లు నడిపించుటచే జీవులకు భోగవైషమ్యము గలిగెను ఈ యర్థము సిద్ధాంతాగమమునందు జెప్పబడినది॥ శ్లో॥ ఆదిసృష్టౌ మహాదేవ శ్శంకరోలోకశంకరః। యథాగ్నేర్విస్ఫులింగాని జాయంతే తద్వదీశ్వరః। స్వాంశస్థి

తానాం జీవానాం తుల్యధర్మేణసాదరాత్ । దేవతారూపదే
హాని దదాశర్వస్సనాతనః। స్వాజ్ఞారూపచతుర్వేదాన్ తేషాం
దత్వా పునఃపునః। ఏతన్మార్గేణమద్భక్త్యావ ర్తధ్వమితిసర్వదా।
ఆజ్ఞాచక్రే కేతతో దేవా స్తాముల్లంఘ్యయథేచ్ఛయా। ప్రవర్తంతే
మహాదేవస్తాన్ దృష్ట్వా నిర్భయాం స్తదా । సృష్టించ విషమం
కృత్వా పాలనంకురుతేస్వయం । అవాంతరమహాస్సృష్టా - దేవ
దేవోంబికాపతిః। కాలరుద్రం మహావిష్ణుం బ్రహ్మాణమకరో
చ్ఛివః। రుద్రస్యజగదుత్పత్తిస్థితిసంహారరూపకం। కర్తృత్వం
ప్రదదాతద్వ ద్విష్ణోశ్చద్వివిధంతథా। బ్రహ్మణస్సృష్టికర్తృ
త్వమేకం దత్వామదాజ్ఞయా। వేదశాస్త్రానుసారేణ తత్తత్క
ర్మానుసారతః। లోకప్రవర్తనంకార్య మిత్యుపోవాచశంకరః॥
అనిశివుండు పార్వతీదేవికుపదేశించెనని రేవణాసిద్ధులవారు మ
రల సిద్ధారాధ్యున కుపదేశించెను. ఈలాచెప్పగా నిర్ముక్త
నీరదాకాశముభంగి నిర్మలమానసుండై శిష్యుండు మరల
నిట్లనియె॥ స్వామి ప్రపంచమీశ్వరకల్పితమంటిరి యాపరమే
శ్వరునెవరుబుట్టించిరి వానిబుట్టించిన వాడొకపరమేశ్వరుడు
న్నాడంటే వానికొకకారణుడుండవలయును అట్లయినననేకే
శ్వరత్వప్రసక్తిగలుగునని గురుండిట్లనియె॥

ఈదోషము నిమిత్తకారణవాదులైన శక్త్యైకదేశప్ర
ప్రామాణ్యవాదులయందుండునుగాని మాబోధయందులేదు.

యథోర్ణనాభిస్సృజతే గృహ్యతేచ అనే శ్రుతిప్రకారముగా నిజశక్తినే జగద్రూపముగా బరిణమింపజేసెంగావున నీపూర్వ పక్షముదగులదు. జగత్తునకాదిసృష్ట్యంగీకరింపక సృష్టికనాది త్వమంగీకరించితే-నదేవసౌమ్యేదమగ్రఆసీత్తనేశ్రుతివిరోధము న్ను అనవస్థాప్రసంగమున్ను గలుగును. ఆకాశశరీరం బ్రహ్మ యనిశ్రుతిబలుక్కంగావునభూతాకాశమునకే అంత నాశములు లేవుగనుక- తచ్ఛరీరియైన పరమేశ్వరుని కెట్లుసంభవించును- ఆకానము శూన్యమంటే క్రోశమాత్రమిదంపురం- దశహస్త మితంగృహమ్-అనియెడి ప్రమాణములయందాకాశము గణన కొచ్చినది గనుక శూన్యమని చెప్పగూడదు. సామశాఖాగత ఛాందోగ్యమునందు భూజలాగ్నులకే యుత్పత్తి జెప్పియున్నది గాన వాయ్వాకాశముల యుత్పత్తి ప్రతిపాదకశ్రుతుల కౌప చారికత్వమును జెప్పవచ్చును. ఆదిసృష్టియందు జీవులు పరి శుద్ధులైతే స్వేచ్ఛానుసార విషమకర్మహేతువైన అజ్ఞాన మెక్కడనుంచి సంభవించెను॥ శ్రు॥ ఏషఏవసాధుకర్మకార యతి తమూర్ధ్వలోకమున్నినీషయతి। ఏషఏవాసాధుకర్మకార యతి। తమధోలోకమున్నినీషయతి। అనే శ్రుతులయందును ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి భ్రామయం త్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥ అనేస్మృతియం దున్ను యంత్రియంత్రన్యాయముగా జీవులీశ్వరప్రేరేపితు

లయి సకలకర్మలొనర్చుచుందురని చెప్పుచున్నది గనుక పారతంత్ర్యులగు జీవుల కిహపరలోకములందు సుఖదుఃఖము లెలాగు గల్గును- శివుడు సర్వసమానుఁడు గనుక జీవులందరి కేక కాలమునందె మోక్షమేలనివ్వకూడదు- తన యాజ్ఞప్రకారమే వారుజరిపిరిగాన వారితప్పేమనియడుగగా సద్గురుండిట్లనియెను॥ శిష్య-ఈప్రశ్నములు బహురహస్యములు. అయినను నీవినయభక్త్యాదులకు మెచ్చి దయచే జెప్పుచున్నాను వినుము॥ జ్ఞాజ్ఞౌద్వావజావీశానీశౌ। నిత్యోనిత్యానాంచేతనశ్చేతనానాం। అనేకశ్రుతులయందు జడజాతియందశ్మలోష్ఠకాష్ఠాదులవలె-చిజ్జాతియందు-జీవేశ్వరులలో వైషమ్యము గలదు- తామ్రాదులయందు స్వాభావికచిలుముండునట్లు జీవునికి సహజాజ్ఞానమున్న నానాశరీరప్రవేశ నిర్గమనాదులున్నప్పటికిని అజుడు-నిత్యుడు- లోహములలో సువర్ణమువలె నీశ్వరుడనాదిముక్తుడు- నిర్మలుడు-సర్వజ్ఞుడు- సర్వశక్తివిశిష్టుడు అని చెప్పియున్నది. గనుక ఖద్యోతమువలెనే జీవుడు జ్ఞానాజ్ఞానస్వరూపుడని చెప్పగా శిష్యుండిట్లనియె. స్వామీ ఆగంతుకమునకే జలోష్ణాదిన్యాయముగా నివృత్తి సంభవించునుగాని స్వాభావికధర్మమునకేలానివృత్తియనగా గురుండిట్లనియె. జలమార్తికలోహరస భ్రమరకీటదధిఘృతాదులందువలె జీవనిష్ఠమగుపాశరూపమలావిద్య సద్గురుకటాక్ష

మునలను నివర్తింపి పరశివస్వరూపుఁ డగును. యాత్రికుంత్రి
న్యాయము చెప్పినప్పటికిని కించిత్కర్తాచకించిద్జ్ఞోఽబద్ధో నాది
శరీరవాన్నిస్మృతులయందు జెప్పినప్రకారము కించిత్కర్తృ
త్వము గలుగుటచే సూర్యప్రకాశము నాశ్రయించి జనులు
స్వవ్యాపారములయందు ప్రవర్తించు చందంబున పరమేశ్వర
ప్రకాశము నాశ్రయించి స్వేచ్ఛానుకూలముగా గొంతవ్యాపా
రము సేయుచుందురు గనుక సుఖదుఃఖభోక్తృత్వముగలిగెను.
సూర్యుఁడు సర్వసరోజములయందు వైషమ్యనైర్ఘృణ్యములు
లేకుండా సమానముగా కిరణప్రసరణము సేయుచున్నప్పటికిని
వికసనోన్ముఖములయిన కమలములే వికసించునట్లు జగదీశ్వ
రుఁడు సర్వసమానుఁడైనప్పటికిన్ని భయభక్తిశ్రద్ధావిశ్వాస
నిత్యానిత్యవస్తువివేకవైరాగ్యశమదమాది సద్గుణప్రయుక్త
చిత్త ముముక్షువులనే దరింపజేయునుగాని తక్కినవారిని దరిం
పజేయఁడు ఇందుకు ప్రమాణము. స్వజాతివిహితాః ధర్మా
న్వేదస్మృత్యుదితాః కృతాత్ । పుంసాంపాప నివృత్తిస్స్యా
త్తయా శుద్ధిస్తుచేతసః। చిత్తశుద్ధ్యాతువిశ్వాస శ్శ్రుతిస్మృతి
షుజాయతే । తస్మాద్భక్తిర్భవేత్పుంసాంశివేపరమకారణే । త
యాసంజాయతేద్దోష దర్శనం సంసృతౌసదా। తస్మాదిహాపర
త్రాపి భోగేషు విరతిర్భవేత్। తయావేదాంత వాక్యార్థే శివ
రూపప్రకాశకం। సమ్యగ్జ్ఞానంభవేత్తేన ముక్తిఃపుంసాంభ

వేద్ధ్రువం। తస్మాన్మహేశ్వరో నిత్యం శ్రుతిస్మృత్యాగమో చితం। వర్ణాశ్రమోచితం ధర్మం ప్రాణత్యాగేపి నత్యజేత్॥ అని శంకరసంహితయందు జెప్పియున్నది. అనగా శిష్యుండి ట్లనియె. శ్రీగురుస్వామీ యావజ్జీవులును ముక్తిఁజెందిన తరువాత తిరిగి జీవసృష్టికలదాయని యడుగగా గురుండిట్లనియె॥ శ్రు॥ ననపునరావర్తతే ననపునరావర్తతే॥ అనావృత్తిశ్శబ్దాద నావృత్తిశ్శబ్దాత్ అనేశ్రుతి సూత్రములయందు బ్రహ్మానుభావం దిన జీవులకు బునరావృత్తి లేదని చెప్పియున్నది. కావున సర్వ జీవముక్త్యనంతరము సృష్టి లేనేలేదు॥ అని శిష్యుండిట్లనియె॥ స్వామీ కొందఱు పరమేశ్వరుడు నిర్విశేషుడవిన్నిశుక్తియం దు రజతమున్ను స్థాణువునందు బురుషుడున్ను మరుమరీచికలయందు జలమున్ను గగనమందు నీలిమయున్ను భ్రాంతిచే నెట్లుతోచునో అట్లే నిర్విశేషచిన్మాత్రునియందు సవిశేష ప్రపంచము భ్రాంతిచే దోచుచున్నదిగాని కాలత్రయమందును లేనేలేదందురగా గురుండిట్లనియె॥ ఈలోకములో ధూర్తజన మోహనార్థమై శివకేశవాదులచే నిర్మింపబడిన మోహశాస్త్రానుసారముగా గొందరు మందమతులిట్లు చెప్పినప్పటికిని జీవేశ్వరమిథ్యాభూత, వాదకనిరీశ్వరాద్వైతము శ్రుతియుక్త్యనుభవనిరుద్ధముగనుక వదిము ముముక్షుజన పరిగ్రాహ్యముగాదు అదెట్లనిన ప్రత్యక్షకశ్రుతిస్మృతులయం

దెక్కడను లేమిగనుక అధ్యారోపాపవాదములు శ్రుతివిరుద్ధ
ములు యుక్తివిరుద్ధమెట్లనిన సృష్ట్యాదియందు బరమేశ్వరు
డొక్కడే యుండెగదా ఈజగద్భ్రాంతిపరమేశ్వరునికేపుట్టెనా
లేకతద్భిన్నునికి బుట్టెనా పరమేశ్వరునికె పుట్టెనంటేని శరీరేం
ద్రియమనఃప్రాణశూన్యుఁడగు పరమేశ్వరునికిభ్రాంతియేలాగున
గలుగును మఱిన్ని భ్రాంతుఁడు అజ్ఞానిగనుక బ్రహ్మకజ్ఞత్వము
సాధించిచే జీవునివలెనే బహుశరీర ప్రవేశనిర్గమనఖేదమో
హాదిధర్మములున్ను సంభవించును అట్లగుటచే బ్రహ్మత్వము
నకేహానిసింభవించును ఇట్లు చెప్పుటచేసర్వమతవిరుద్ధమున్ను
మహాపాపహేతువున్ను సర్వజ్ఞత్వాది ధర్మప్రతిపాదక శ్రుతి
విరుద్ధమున్నుగలుగును బ్రహ్మభిన్నునికిగలిగెనంటే తద్భిన్నవ
స్తువేలేదు గనుక స్వమతహానీసంభవించును. అదిన్నిగాక
అధ్యాసయనగా అన్యమందన్యధర్మారోపముగదా పూర్వ
మునందు సత్యమగు సర్పదర్శనము గలిగితేకాని తరువాత
మందతమస్సునందురజ్జువునందు సర్పాధ్యాసగలుగదు. అట్లా
యితే ఈమతమందు వాస్తవప్రపంచమొకటిన్ని సాకారుఁడై
న పురుషుఁడొకఁడున్ను జగదాదియందు నిర్ణయింపవలయును
అలాలేమిగనుకను బ్రహ్మసూత్రములయం దెక్కడను ఈనిరీ
శ్వరాద్వైతము సెప్పబడకపోవుటచేతను యుక్తివిరుద్ధము
అనుభవముచే విచారించినా కొందరుసుఖులై కొందరు

దుఃఖులై కొందరు దరిద్రులై కొందరుధనవంతులై కనుబడుచు
న్నారు. కనుక జీవులకు బూర్వజన్మములున్ను బుణ్యపాపము
లున్ను తన్నియామకుడయిన ఈశ్వరుడున్ను గలిగియున్నా
రని సేశ్వరవాదుల కందరికిన్ని అనుభవము గలదుగనుక
భక్తుల కీవాదము అనుభవవిరుద్ధమగుటచే బ్రామాణ్యము
గానేరదు అని జెప్పగా మరల శిష్యుండిట్లనియె॥ స్వామీ
కొందరీభూతాకాశమే పరమాత్మయనియు అదే అచలమనియు
దానియందు జైతన్యము దనంతటదానే యుద్భవించి తానే
విరమించుననియు మూలములేని ఈయెరుక అసత్యమనియు
లుసత్యమని తెలిసికొన్నమాత్రముననే మోక్షము సిద్ధించు
ననియు శరీరగత నేత్రాదులకును శరీరమునకును భేదము
లేనట్లు శరీరద్రష్టయగు యెరుకకున్ను దృశ్యమగు శరీరమున
కున్ను భేదములేదనియుం జెప్పుదురు అది సత్యమాకాదా
అని యడుగ సర్వవేదాంతసార ధురీణుండగు గురుండిట్లనియె॥
వెనుక చెప్పిన సేశ్వరాద్వైతముకంటె నీశూన్యాద్వైతవాద
ము మిక్కిలి యనాదరణీయము శ్రుత్యుక్త్యనుభూతివిరుద్ధము
అదెట్లంటే॥ శ్రు॥ ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధా
రిణీ । యత్పరంబ్రహ్మసర్వాత్మా విశ్వాహ్యాయతనంమహత్॥
తస్మాద్వా ఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః॥ శ్లో॥ చైతన్యం
శాశ్వతంశాంతం వ్యోమాతీతం నిరంజనం॥ అనిమొదలి శ్రుతి

స్మృతులయందు పరమాత్మ ఈభూతాకాశాతీతుడనియు దీనికి
కారణుడనియుం జెప్పియున్నదిగాన మృత్పాషాణాదులవలె
జడమై జన్యమైన ఈభూతాకాశము బ్రహ్మకాదు ఖంబ్రహ్మ
కంబ్రహ్మ ఆకాశఆత్మా ప్రాణోవైబ్రహ్మ అన్నంబ్రహ్మ మనో
బ్రహ్మ అసావాదిత్యోబ్రహ్మ అనే శ్రుతులకు ఆకాశ స్తల్లిం
గాత్ అతఏవప్రాణః అనే బ్రహ్మసూత్రములయందు భూతా
కాశాదులకు బ్రహ్మత్వము నిరాకరించి సర్వశబ్దవాచ్యుడు
పరమాత్మయని సాధించి విరోధపరిహారాధ్యాయమునందు,
అసదితి చేన్న-ప్రతిషేధ మాత్రత్వాత్- అనేబ్రహ్మసూత్రము చే
నీయుభయమతములు భ్రాంతిమూలకములని నిరాకరించి
నారు జీవులకు మూలములేదనుమాట సర్వశ్రుత్యుక్త్యనుభవ
విరుద్ధమాదెటువలెనంటె॥ శ్రు॥ సన్మూలాస్సోమ్యేమాః ప్రజా
యంతే-యతోవాఇమాని భూతాని జాయంతే మాయాంతు
ప్రకృతింవింద్యా న్మాయినంతు మహేశ్వరం। తస్యావయవభూ
తోత్థం. వ్యాప్తం సర్వమిదంజగత్ । జ్ఞాజ్ఞౌద్వావజా వీశానీశౌ
నిత్యోనిత్యానాం చేతన శ్చేతనానాం అనే శ్రుతులయం
దీశ్వరుండజులైన జీవులను దసవలనగు సూలస్థిత ధాన్యము
వలె.నగ్నే విస్ఫులింగములవలె బహిర్నిర్గతులనుగా జేయునని
యు తద్ధేతువు చేజీవులునిత్యులు అజులనియుస్పష్టముగా జెప్పియు
న్నదిగాన యాత్మోత్పత్తియు నాత్మహాననమును జెప్పుశాస్త్రము

మోహశాస్త్రమునియజ్ఞులయినను దెలిసికొనుదుకు. కులాలకువిం దాదులు లేకుండ ఘటపటాదులు దామే స్వయంభువములు గా వలయును; అట్లు కానముగనుక కారణములేని కార్యముబుట్టు తుందని యొకనాటికైనను జెప్పకూడదు గాన నీవాదనుయు క్తికమనుటయుంరదు నిస్సందేహము. కారణము లేక కార్యములు గలిగేటట్టయితే బీజములు లేనిదే వృక్షములు న్నూ తలిదండ్రులు లేనిదే పుత్రపుత్రికలున్ను అన్నపానీయాదు లు లేకనే క్షుత్తృష్ణాదులనివృత్తియుం గలుగవలెను. స్వప్న మందొకరికి కనుపడినవస్తుజాలము మరియొకరికి కనుబడనట్లే ప్రపంచము నీకు గనుబడినను నాకెగనుబడదంటివేని సర్వాను భవసిద్ధమయిన యీప్రపంచము లేదనుట నాతల్లి వంధ్యయ మనట్లు ప్రత్యక్షావలాప్రసంగము సంభవించును. అది యున్న త్తునికైన నిష్టముగాదు. చైతన్యముగు ఎరుకయు శరీరము నేక మంటే మరణకాలమునందు తద్బంధులకు రోదనప్రసంగమే సంభవించదు. శరీరమునకు మరణమున్ను లేకపోవలెను. జీర్ణానివస్త్రాణి యథావిహాయ॥ అనియెడి గీతావాక్యరీతువుగా జీవులీస్థూలశరీరములను విడిచి నూతనశరీరములను తత్తత్క ర్మానుసారముగా బొందుటయున్ను తదనంతరమాశరీరము ఘటపటాదులవలెనే దహనాదిక్రియలను జెందినను దుఃఖపడ కుండుటయును సర్వానుభవసిద్ధమయ్యున్నదిగనుక శరీరమా

త్మారార్వ్యైకైః అనే బౌద్ధశాస్త్రానుభవమునుసరించినది గ
నుక బౌద్ధాంతర్భూతమనుటకు సంశయము లేదు. అందుచేతనే
ఈమతము చతుర్విధబౌద్ధములలో జ్ఞానార్థోభయశూన్యబౌ
ద్ధమని వేదవ్యాసులవారిచే బ్రహ్మసూత్రములందు నిర్ణయింప
బడినది. జడమైన భూతాకాశమువల్లనే మోక్షము సంభవిం
చేటట్టుదయితే ఘటపటాదిజ్ఞానమువల్లను మోక్షమేల సిద్ధింప
దు నచక్షుషాగృహ్యతేనాపివాచా. ఇటువంటి శ్రుతులందు
పరమాత్మ జ్ఞానేంద్రియకర్మేంద్రియ గోచరుడు గాడని జెప్పి
యున్నదిగనుక నీమాట భ్రాంతిమూలమేను ఈమతమందు
దేహాత్మలకు భేదములేదుగనుకను గలలోవచ్చిన దేహముల
వలె తామెవచ్చి తామెపోవును గనుకను మోక్షప్రయత్న
మునుతత్సాధనమగు గురూపదేశ తచ్ఛాస్త్రశ్రవణతన్మం
త్రోపాసనాదులు నావశ్యకములేదు. సుషుప్తినుంచిజాగ్రత
కలిగినట్లు ఎరుకతనంతటతానేవచ్చుచు బోవుచుండుననియుం
జెప్పెడి.మందమతులు సుషుప్తియేకారణ శరీరమనియెడి జ్ఞాన
శూన్యులు తామేకారణమువల్ల గార్యజన్యత్వ మొప్పకున్నవా
రౌదురు॥ ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశ స్సంసారబంధస్థితిమోక్ష
హేతుః॥ అనెడి శ్రుతియందు జీవులకు జాగ్రత్స్వప్నసుషుప్తి
ప్రదాతృత్వమున్ను మూలతూలస్థూలరూపాజ్ఞానకారణ మూ
లావిద్యారూపపాశ మోచనకర్తృత్వమున్ను పరమేశ్వరునికే

చెప్పియున్నది గనుక ముముక్షువులయినవారు భయాభక్తిశ్ర
ద్ధావైరాగ్యోపరతిబోధాది యుక్తులయి పరబ్రహ్మోపాసన జేసి
సంసారసాగర కారణమగు మాయనుదరింప వలెను అనిన
శిష్యుండిట్లనియె. అసత్యమప్రతిష్ఠంతె జగదాహుర్నిరీశ్వరాః।
తస్మాన్ముముక్షుస్తన్మార్గంమనసాపినసంస్మరేత్। జడానామేవజ
న్యత్వంకుంభాదీనాంచసమ్మతమ్। కల్పితానాంపదార్థానాంసామ
ర్థ్యంనైవజాయతే। అకల్పితశ్శివస్సాక్షాజ్జగజన్మాదికారణః॥
అనేకశాస్త్రములవల్లను ఇపుడు దేవరవారుసెప్పిన శ్రుతియుక్త్యను
భవముల చేతను జగజ్జీవేశ్వరమిథ్యావాదియగుచున్న నిరీశ్వరా
ద్వైతమతము॥ చకారమోహశాస్త్రాణి కేశవోపిశివోపిచ।
జైనంబౌద్ధంనచార్వాకం పాంచరాత్రంచలాకులమ్। శూన్యా
ద్వైతంచకాపాలంమిథ్యాద్వైతంతథైవచ। పురాదానవమో
హార్థంకల్పితానిమహీతలే॥ అని కూర్మపురాణమందు వేద
వ్యాసులవారిచే నిర్ణయింపబడుటవల్లను పూర్వోదాహృతమత
ములు గుహ్యచాపల్యజిహ్వాచాపల్యములదగిలిన భ్రాంతిమూ
లములేయని నాకు నిశ్చయము గలిగినది కాని ఈచరాచర
ప్రపంచమంతయును బరమేశ్వరుని శరీరమనియు పరమేశ్వరుడు
శరీరియనియు పరిచ్ఛిన్నుడై మహాకైలాసవైకుంఠ సత్యలో
కాదులయందుండుననియు సూక్ష్మ దేశదేశవర్తియయినను
ప్రభసర్వదేశములయందు వ్యాపించినరీతువుగా బరమేశ్వర

ప్రకాశమునకే సర్వవ్యాపకత్వమనియు ముక్తదశయందు కూడా జీవులు సాయూజ్యధారులై పారతంత్ర్యులై యుందురని యు జెప్పుదు రదినిజమాయని యడుగగా గురుండిట్లనియె. వినవోయి శిష్యా విశిష్టాద్వైత మతము వ్యవహారమునకే విరుద్ధముగనున్నది అదెట్లనిన॥ విశిష్టంచవిశిష్టంచవిశిష్టే. విశిష్టయోరద్వైతం విశిష్టాద్వైతం సూక్ష్మచిదచిద్విశిష్టమైన బ్రహ్మమునకును స్థూలచిదచిద్విశిష్టమైన బ్రహ్మమునకు నేకత్వము ను యర్థము-అటులైతే-విశిష్టమద్వైతముగాదు. అద్వైతమువిశిష్టముగాదు. విశిష్టపదమునకును అద్వైతపదమునకును సమాసమేసంభవించదు అనయర్థములగుటచే శాబ్దబోధయుంగలుగదు మఱియుసవిశేషశ్రుతులకును నిర్విశేషశ్రుతులకును సమన్వయమునిమిత్తము విశిష్టాద్వైతమువశ్య మంగీకరింపవలయునంటివేని అది శ్రుతియుక్త్యనుభవ విరుద్ధమగుటచే వైదికజనపరిగ్రహముగాదు విశిష్టాద్వైతప్రతిపాదకశ్రుతులెక్కడను లేవు యస్యాత్మాశరీరం అనియెడిశ్రుతి॥ అన్నంబ్రహ్మేతివ్యజానాత్॥ అనియెడిశ్రుతివలెనే ఔపచారికము జీవప్రకృతులు పరమేశ్వరశరీరమైతే జీవనిష్టసుఖదుఃఖములను ప్రకృతినిష్ఠాన్నృతజడములున్ను పరమేశ్వరునికిసంభవించును మఱియు తనశరీరసృష్టితనకు సంభవించదుగాన యతోవాఇమానిభూతాని జాయంతే అనియెడి శ్రుతికప్రమాణమునంభవించునుఅంతబ

హిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః॥ ఆకాశవత్సర్వగతోని
త్యః॥-అంతఃపూర్ణో బహిఃపూర్ణో పూర్ణః కుంభఇవార్ణ
వే॥ ఓంఅదః మిదంపూర్ణాత్పూర్ణముదచ్యతే॥ పూర్ణ
స్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥ అనియెడి శ్రుతిప్ర
తిపాదితపరిపూర్ణత్వభంగముసంభవించును పరిచ్ఛిన్నత్వ మం
గీకరించితే ఘటాదులవలెనష్టప్రసంగమున్ను ఉత్పత్తిమత్వము
న్ను సిద్ధించవలయును శ్రుతులయందంతటను బ్రహ్మకుపరిపూ
ర్ణత్వమును జెప్పియున్నదిగాని ప్రకాశకెక్కడను జెప్పియుండ
లేదు మరియునెవ్వరికిని బ్రహ్మయొక్కడా ఇద్దరా అనియెడిసం
దేహమేపుట్టినపుడు సృష్టికంటె బూర్వమందున్న సూక్ష్మబ్ర
హ్మమునకును సృష్టితర్వాతస్థూలబ్రహ్మకున్ను ఏకత్వమేయని
యుజెప్పుటయున్నత్త్రవలావపుగానున్నది ముక్తదశయందును
ప్రభుభృత్యన్యాయనే అంగీకరించితే బ్రహ్మవిద్బ్రహ్మైవభవ
తిఅనియెడిశ్రుతివిరుద్ధమున్ను సారూప్యదారులైన। నిత్యసూరు
లైన జయవిజయాదులకు పునర్జన్మమున్ను జూచుటచేనీమ్మతమువి
చారితరమణీయముగాని సుజనసేవ్యముగాదు అయితేసంయుక్త
భేదమతమని జెప్పవచ్చునుగాని విశిష్టాద్వైతమతమని చెప్ప
గూడదు అనినశిష్యుండుమరలనిట్లనియె స్వామికొందరు అంకు
రాదికంసకర్తృకంకార్యత్వాద్ఘటవత్॥ అనియెడిఅన్నుమానము
జగజ్జన్మాదికారణత్వముచేబ్రహ్మమును మేయించుచుబ్రహ్మన

త్వమందనుమానమే ముఖ్య ప్రమాణమని చెప్పుదురని నగురుండి ట్లనియె. అట్లవు తేరథగోపురప్రాసాదాదినిర్మాణమందేక కర్తృత్వముజూడముగనుక నటువలె నేజగత్తునకున నేకకర్తృత్వము సిద్ధించిటచేన నేకేశ్వరత్వము సంభవించుంగావున నదియును గ్రాహ్యంబుగాదు. తనమనస్సె తనకు సాక్షిగావున నుమనఏవ మనుష్యాణాం కారణంబంధ మోక్షయోః అనే శాస్త్రరీతువుగా మనసే బ్రహ్మమనియుంటే అచేతనమైన మనస్సునకు సాక్షిత్వముసంభవించదు. సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ అనేశ్రుతియందు చైతన్యమునకేసాక్షిత్వము సెప్పియున్నది. బౌద్ధులకందరికినివారి వారిమనసేసాక్షి గానుండును గావున నామతములన్నియును సమ్మతములేకావలయును. మనఏవ అనేవాక్యమునకు ఘటమునకు దండమువలె కారణత్వముగాని కులాలునివంటి కారణత్వము గాదు అనిన శిష్యుండు నిస్సంశయుండై స్వామీ తాము సెప్పిన శ్రుత్యుక్తనుభవసిద్ధమైన భేదాభేదమతమొకటియే సత్య వేదాంతసిద్ధాంతమని దృఢమైనది పరమేశ్వరుని చేజగత్తు పుట్టినదని చెప్పితిరి. దానిక్రమం బెట్లనిన గురువరుండిట్లనియె॥ పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ। ఏకఏవరుద్రో న ద్వితీయాయతస్థె। యదాతమస్తంన దివానరాత్రిః న సన్నచాసచ్ఛివఏవ కేవలః॥ తదక్షరంతత్సవితుర్వరేణ్యం ప్రజ్ఞాచతస్మాత్ప్రసృతా పురాణీ॥ మాయాంతుప్రకృతింవింద్యాన్మా

హిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః। ఆకాశవత్సర్వగతోని
ఠంశఠి-అంతఃపూర్ణో౽ బహిఃపూర్ణో౽పూర్ణః కుంభఇవార్ణ
వే। ఓంఅదః మిదంపూర్ణంపూర్ణాత్పూర్ణముదచ్యతే। పూర్ణ
స్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥ అనియెడి శ్రుతిప్ర
తిపాదితపరిపూర్ణత్వభంగముసంభవించును పరిచ్ఛిన్నత్వమం
గీకరించితే ఘటాదులవలెనష్టప్రసంగమున్ను ఉత్పత్తిమత్త్వము
న్ను సిద్ధించవలయును శ్రుతులయందంతటను బ్రహ్మకుపరిపూ
ర్ణత్వమును జెప్పియున్నదిగాని ప్రకాశకెక్కడను జెప్పియుండ
లేదు మరియునెవ్వరికిని బ్రహ్మయొక్కడా ఇద్దరా అనియెడిసం
దేహమేపుట్టినపుడు సృష్టికంటె బూర్వమందున్న సూత్మబ్ర
హ్మమునకును సృష్టితర్వాతస్థూలబ్రహ్మకున్ను ఏకత్మమేయని
యుజెప్పుటయున్మత్తప్రలాపముగానున్నది ముక్తదశయందును
ప్రభుభృత్యన్యాయనే అంగీకరించితే బ్రహ్మవిద్బ్రహ్మైవభవ
తిఅనియెడిశ్రుతివిరుద్ధమున్ను సారూప్యదారులైన। నిత్యసూరు
లైన జయవిజయాదులకు పునర్జన్మమున్ను జూచుటచేనీమతముపి
చారితరమణీయముగాని సుజనసేవ్యముగాదు అయితేసంయుక్త
భేదమతమని జెప్పవచ్చునుగాని విశిష్టాద్వైతమతమని చెప్ప
గూడదు అనినశిష్యుండుమరలిట్లనియె స్వామికొందరు అంకు
రాదికంసకర్తృకంకార్యత్వాద్ఘటవత్॥ అనియెడిఅనుమానము
జగజ్జన్మాదికారణత్వముచేబ్రహ్మమును మేయించుచుబ్రహ్మన

త్వమందనుమానమేమాఖ్య ప్రమాణమని చెప్పుదురనినగురుండి
ట్లనియె. అట్లవు తేరథగోపురప్రాసాదాదినిర్మాణమందేక కర్తృ
త్వముజూడముగనుకనటువలె నేజగత్తునకున నేకకర్తృత్వము
సిద్ధించిటచేననేకేశ్వరత్వము సంభవించుంగావున నదియును
గ్రాహ్యంబుగాదు. తనమనస్సే తనకు సాక్షిగావున మనఏవ
మనుష్యాణాంకారణంబంధమోక్షయోః అనే శాస్త్రరీతువుగా
మనసే బ్రహ్మమనియంటే అచేతనమైన మనస్సునకు సాక్షిత్వ
మునంభవించదు. సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ అనే శ్రుతియందు
చైతన్యమునకేసాక్షిత్వము సెప్పియున్నది. బౌద్ధులకందరికినివారి
వారిమనసేసాక్షిగానుండునుగావున నామతములన్నియును సమ్మత
ములేకావలయును. మనఏవ అనేవాక్యమునకు ఘటమునకు
దండమువలె కారణత్వముగాని కులాలునివంటి కారణత్వము
గాదు అనిన శిష్యుండు నిస్సంశయుండై స్వామీ తాము
సెప్పిన శ్రుత్యుక్తనుభవసిద్ధమైన భేదాభేదమతమొకటియే
సత్యవేదాంతసిద్ధాంతమని దృఢమైనది పరమేశ్వరుని చేజగత్తు
పుట్టినదని చెప్పితిరి. దానిక్రమం బెట్లనిన గురువరుండిట్లనియె॥
పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ।
ఏకఏవరుద్రోనద్వితీయాయతస్థే। యదాతమస్తన్నదివానరాత్రి
ర్నసన్నచాసచ్ఛివఏవకేవలః॥ తదక్షరంతత్సవితుర్వరేణ్యం ప్రజ్ఞా
చతస్మాత్ప్రసృతాపురాణీ॥ మాయాంతుప్రకృతింవిద్యాన్మా

యినంతు మహేశ్వరం। తస్యావయవ భూతైస్తు వ్యాప్తంసర్వ మిదంజగత్। అజాతఇత్యేవంకశ్చిద్భీరుః ప్రపద్యతే। రుద్ర యత్తేదక్షిణంముఖం తేన మాంపాహినిత్యం॥ తస్మాద్వా ఏత స్మాదాత్మన ఆకాశస్సంభూతః। సబ్రహ్మాసశివస్సహరిస్సేంద్రస్సో క్షరః పరమస్స్వరాట్ ॥ సఏవవిష్ణుస్సప్రాణస్సకాలోగ్నిస్సచం ద్రమాః। సఏవసర్వంయద్భూతంయచ్చభవ్యంసనాతనం॥ అనే శ్రుతులయందు సృష్టికంటె పూర్వమందు నిత్యుడై సర్వశబ్ద వాచ్యుడై సర్వపరిపూర్ణుడైన పరశివునియందు వహ్నియం దుష్ణశక్తివలె బీజమందు వృక్షశక్తివలె జలమందు ద్రవశక్తి వలె అవక్వమృత్తుయందు ఘటశక్తివలె సజాతమై స్వాభావిక మైన చిచ్ఛక్తియుండును. ఆచిచ్ఛక్త్యవచ్ఛిన్నుడయిన పరశి వునివల్ల శబ్దగుణకమయిన యాకాశముబుట్టెను తదాకాశా వచ్ఛిన్నుడైన ఈశానునివల్లను తచ్ఛక్తియయిన పరాశక్తివ ల్లను శబ్దస్పర్శాత్మకమైన వాయువుబుట్టెను తద్వాయుత్వావ చ్ఛిన్న తత్పురుషునివల్లను తచ్ఛక్తియయిన యాదిశక్తి వల్లను శబ్దస్పర్శ రూపాత్మకమైన వహ్నిపుట్టెను తద్వహ్న్య వచ్ఛిన్నఘోరునివల్లనుతచ్ఛక్తియయినయిచ్ఛాశక్తివల్లను శబ్ద స్పర్శరూపరసాత్మకమైన జలముదయించెను తజ్జలావచ్ఛిన్న వామదేవునివల్లను తచ్ఛక్తియయిన జ్ఞానశక్తివల్లను శబ్ద స్పర్శరూప రసగంధాత్మకమైన పృథివిపుట్టెను. పృథివ్యవచ్ఛిన్న

సద్యోజాతునివల్లను తచ్ఛక్తియయిన క్రియాశక్తివల్లను సచ రాచరాత్మకమైన ప్రపంచ ముదయించెను. త్రిగుణాత్మక పాశరూపమైన జడప్రకృతి ననుసరించి చిచ్ఛక్తివిశిష్టుండైన పరశివుడు వ్యోమాద్యుత్పత్తిని జేయుటచే నవి త్రిగుణాత్మకములాయెను, ప్రథమోత్పన్నములయిన ఈసూక్ష్మభూతములకే తన్మాత్రలనియు అపంచీకృత భూతములనియుంబేరు॥ ఈ భూతములవల్లనుంచి ఈశ్వరుడు లింగశరీరమును బుట్టించెను॥ అనిన శిష్యుండిట్లనియె॥ స్వామీ లోకములో సృష్టిజేయుట యందు ఉపాదానకారణము నిమిత్తకారణమనియు కారణద్వయముండవలెనుగదా అదెట్లనిన ఘటశరావాద్యుత్పత్తియందు మృదాదు లుపాదానకారణములు కులాలాదులు నిమిత్తకారణములుగదా అటువలెనే ఈజగత్తునకు భయకారణములెట్లు ఈశ్వరుడు నిమిత్తకారణము ప్రకృతియుపాదానకారణమంటిరేని సౌమ్యైకేన మృత్పిండేనసర్వంమృణ్మయంవిజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యం॥ ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానురోధాత్. అనేశ్రుతి ప్రతిపాదిత ప్రతిజ్ఞాదృష్టాంతములకు విరోధమువచ్చును॥ ఐతదాత్మ్య మిదంసర్వం॥ సర్వంఖల్విదంబ్రహ్మాసర్వోవైరుద్రః అని యెడి శ్రుతులకు విరుద్ధమున్నువచ్చును॥ మాయకుని మిత్తకారణత్వము సెప్పిననదిన్ని యుక్తముగాదు. ఈశ్వరుడు పా

దానకారణుడై తే ప్రపంచమంతయు సచ్చిదానంద స్వరూప ముగా నుండవలయును పరమేశ్వరునికి వికారిత్వపరిణామిత్వా దులున్ను సంభవించును గనుక నీసంశయములనుదీర్చి రక్షిం పుమనిన గురువరుం డిట్లనియె । వినవోయి శిష్యా నిమిత్త కారణంబు పాదానకారణంబును బరమేశ్వరు డొక్కడే ఆ యెను సాలెపురుగు శరీరప్రధానమై యుపాదాన కారణంబును బుద్ధిప్రధానమై నిమిత్తకారణముయినయట్లు ఈశ్వరుడు త్రిగు ణాత్మిక మాయశక్తితోగూడి యుపాదానకారణుడును శుద్ధసత్వ ప్రధానమయిన చిచ్ఛక్తితోగూడి నిమిత్తకారణంబాయెను గనుక సర్వశ్రుతులకు విరోధము సంభవించదు॥ ఇందుకు య థోర్ణనాభిస్సృజతేగృహ్యాతేచ అనియెడి శ్రుతియే ముఖ్యప్ర మాణము. స్వామీ సచ్చిదానందుడైన పరమేశ్వరునివల్ల అనృతజడదుఃఖాత్మకమైన ప్రపంచ మెట్లుదయించెననిన గురుం డిట్లనియె॥ యథాసతఃపురుషాత్కేశలోమానితథాక్షరాత్సంభ వంతీహవిశ్వమనియెడి శ్రుత్యుక్తప్రకారముగా బుట్టెను. కించి జ్ఞుడైన జీవుడే అభిన్ననిమిత్తోపాదాన కారణుడై స్వాప్నిక ప్రపంచమును బుట్టించుట సర్వానుభవసిద్ధమయినదే గనుక అఘటనఘటన సమర్థుండగు బరమేశ్వరునిశక్తికేమిజెప్పవలెను. అనిన శిష్యుం డిట్లనియె. స్వామీ శరీరయుక్తోర్ణనాభిదృష్టాంత ము అశరీరియైనపరమేశ్వరుని కెట్లుసంభవించుననగా, గురుండిట్ల

నియె॥ అపాణిపాదోహమచింత్యశక్తిః పశ్యామ్యచక్షుస్సశృణో
మ్యకర్ణః। అహం విజానామి వివిక్తరూపో నచాస్తివేత్తామమ
చిత్సదాహం। వైదేరనేకై రహమేవ వేద్యో వేదాంతకృ
ద్వేదవిదేవచాహం। నపుణ్యపాపే మమ నాస్తి నా
శోనజన్మదేహేంద్రియబుద్ధిరస్తి॥ అనేకశ్రుతులయందు సర్వ
జ్ఞుండైన శివుండు మాయామోహితుండై కించిజ్ఞుండైన జీవునివ
లెగాక తనమహిమను దానేస్పష్టముగాఁజెప్పెను గనుక సంశ
యింపంబనిలేదు రూపరహితమై జడమైనవాయువునందు వృక్షో
త్పాటనాదిసామర్థ్యము గనుబడుచుండగా చిదాకాశస్వరూపుం
డైన పరశివునికి చింతింప నలవియగునా అనిన నిరస్తనీర
దాకాశంబుచందంబున నిర్మలుండై శిష్యుండిట్లనియె॥ స్వా
మీ అనంతశక్తివిశిష్టుండగు పరశివుడు త్రిగుణాత్మకమాయ
తోఁగూడి త్రిగుణాత్మకభూతపంచకముఁబుట్టించి వానిచేసూక్ష్మ
స్థూలదేహములను ఘటపటాది ప్రపంచమంతయుంబుట్టించెన
నిచెప్పితిరి తద్రహస్యమును విశదముగా దెల్పుమనినగురుండిట్ల
నియె॥ లింగశరీరోత్పత్తిని మొదలఁజెప్పెదవినుము మొదట నా
కాశముయొక్క సాత్వికాంశమువలన శ్రోత్రేంద్రియంబును
పవనసాత్వికాంశమువలన త్వగింద్రియంబును వహ్నిసాత్వికాం
శమువలన చక్షురింద్రియంబును సలిలసాత్వికాంశంబున రస
నేంద్రియంబును పృథివీసాత్వికాంశమువలన నాసికేంద్రియంబు

బుట్టెను ఈపంచభూతములయొక్క సత్వగుణార్ధమువలన ఉక్త
ప్రకారము జ్ఞానేంద్రియములుబుట్టెనుతక్కినతదర్ధసాత్వికాంశ
సమష్టివలన నంతఃకరణముబుట్టె అదివృత్తిభేదములచే మనో
బుద్ధిచిత్తాహంకారము లాయెను అందుఆకాశసాత్వికాంశము
వలన జ్ఞాతపవనసాత్వికాంశమువలనమనస్సు వహ్నిసాత్వికాం
శమువలన బుద్ధి జలసాత్వి కాంశమువలన చిత్తము భూసాత్వి
కాంశమువలన అహంకారమును బుట్టెను సప్తదశక లింగంబ
నుమతంబున మనోబుద్ధులు రెండొకటి చిత్తాహంకారంబులు
రెండొకటి ఏకోనవింశతికంలింగంబనుమతంబున నాలుగును వే
ర్వేరుగా లెక్కింపవలయును ఇకనుకర్మేంద్రియవిచారమును జె
ప్పెదము వినుము ఆకాశరజోంశమువలన వాగింద్రియము పవ
నరజోంశమువలన పాణీంద్రియము అగ్నిరజోంశమువలనపా
దేంద్రియము జలరజోంశమువలన శిశ్నేంద్రియము పృథివీర
జోంశమువలన గుదేంద్రియమును బుట్టెను ఈపంచకర్మేంద్రి
యకారణపంచభూతరాజసాంశార్ధంబు సమష్టివలన బంచప్రా
ణంబులు బుట్టెను. అది వృత్తిభేదంబువలన నయిదు విధంబు
లాయెను. ప్రాణము అపానము వ్యానము ఉదానము సమాన
ము. వీటిలోపల నాగకూర్మకృకరదేవదత్తధనంజయులని అ
యిదుపవాయువు లంతర్భూతములాయెను. ఆకాశరజోంశము-
వలన ప్రాణము వాయురజోంశమువలన నపానము వహ్నిర

జోంశమువలన వ్యానము సలిలరజోంశమువలన నుదానము. పృథివీరజోంశమువలన సమానము నుదయించెను. జ్ఞానేంద్రియపంచకము కర్మేంద్రియపంచకము పంచప్రాణములు. అంతఃకరణద్వయముగలిసి పంచప్రాణమనోబుద్ధిదశేంద్రియసముదాయం అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగంభోగసాధనము శాస్త్రరీతిగా లింగశరీరమనియు సూక్ష్మాంగమనియుం జెప్పబడును. కొందరు షట్త్రింశత్తత్వాత్మకలింగమందురు దాని క్రమంబు సెప్పుచున్నారము. శ్లో॥ వ్యోమాదిపంచకంచైవ పరాశక్త్యాదిపంచకం। తథేశానాదికం పంచతద్వత్ప్రాణాదిపంచకం। శ్రోత్రాదపంచకంచైవతథావాగాదిపంచకం। జీవోంతఃకరణంచైవమాయావిద్యారథైవచ। చిచ్ఛక్తిశ్చశివస్తద్వత్షట్త్రింశత్తత్వసంజ్ఞకాః॥ మరికొందరు ఆకాశాదీనిభూతాని పంచతేషాంప్రకీర్తితాః। గుణాశ్శబ్దాదికంపంచపంచకర్మేంద్రియాణిచ। జ్ఞానేంద్రియాణిపంచైతే ప్రాణాదిదశవాయవః। మనోబుద్ధిరహంకారశ్చిత్తంచేతిచతుష్టయం। తేషాంకారణభూతైకా విద్యాషట్త్రింశకఃపశుః। విశ్వస్యజగతఃకర్తాపశోరన్యఃపరశ్శివః॥ అనియు మరికొందరు ప్రాణాదిపంచకంచైవ తద్వద్వ్యోమాదిపంచకం। శ్రోత్రాదిపంచకంచైవ తథావాగాదిపంచకం। మనశ్చాహంకృతిశ్చైవమహాత్ప్రకృతిపూరుషా। రాగోవిద్యాకలాచైవ నియతిః కాలఏవచ। మా

యాచశుద్ధవిద్యాచ మహేశ్వరసదాశివౌ। శక్తిశ్చశివతత్వంచ షట్త్రింశత్తత్వసంజ్ఞకాః॥ అనియు మరికొందరు భూతానిపంచకంచైవ తథైశానాదిపంచకం। ప్రాణాదిపంచకంచైవ తథా శక్త్యాదిపంచకం। కర్మేంద్రియాణిపంచైవ పంచజ్ఞానేంద్రియాణిచ। మనోబుద్ధిరహంకారశ్చిత్తంచేతిచతుష్టయం। జీవఃపరశివశ్చైవషట్త్రింశత్తత్వసంజ్ఞకాః॥ అనియుంజెప్పుదురు. ఎందరెన్ని విధములజెప్పిన నీసెప్పినవాటిలో నాతర్భూతము లగుచుండును. సూక్ష్మభూతాంశపంచకమున్ను పంచభూతములసత్వరజోగుణములును గలిసి లింగమాయెను. గనుక నిది త్రివృత్కరణమని జెప్పబడుచున్నది. దీనినే సూక్ష్మసృష్టియందురు. కొందరు వ్యష్టిశరీరాభిమాని జీవుడనియు నితనికి విశ్వతైజనప్రాజ్ఞ సంజ్ఞలు గలవనియు సమష్టిలింగశరీరాభిమాని ఈశ్వరుడనియు అతనికి హిరణ్యగర్భుడనియు సూత్రాత్ముడనియు ప్రాణుడనియు నామముగలవందురు. శ్రుతియుక్త్యనుభవముల విచారింపగా సర్వజీవనియామకుం డీశ్వరుడుగాని జీవసమష్టియీశ్వరుడు గాడు. ఈశానస్సర్వవిద్యానా మీశ్వరస్సర్వభూతానాం యతోవాఇమానిభూతానిజాయంతే।ఏషాదిమీశః.పశుపతిః పశూనాం సర్వభూతదమనాయనమః॥ శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి । భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥ అనే శ్రుతిస్మృతులచేతను విచారించగా

జేయుచుండిన శివానుగ్రహంబుగల్గి దానిచే దుష్టవాసనలు క్షయించి దినదినాభ్యాసముగా జేయుచుండిన క్షీరజలాదులచే బాలవృక్షాదులు క్రమక్రమంబుగా వృద్ధిబొంది ఫలవంతము లగునట్లు శ్రవణాదులచే శివజ్ఞాన మభివృద్ధిబొంది మోక్షం బను ఫలంబు నొందుదురు॥ స్వామీ శివయోగాభ్యాసము లేకుండిన శ్రవణాదిజన్యమయిన జ్ఞానముచే మూలాజ్ఞానము నశించునా లేక వ్యర్థమైపోవునా అనిన గురుండిట్లనియె. "ఆర్తో జిజ్ఞాసురర్థార్థీజ్ఞానీచ భరతర్షభ" అని గీతలయందు జెప్పియు న్నది భక్తివిష్టచే నార్తుడై శ్రవణాదులొనర్చినవాడు శివాను గ్రహముచే జన్మాంతరంబున నిర్విఘ్నంబుగా శివయోగసిద్ధిం జెంది శివజ్ఞానారూఢుండై కైవల్యము క్రింజెందును॥ శ్లో॥ "త చ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనం। ఏతదేకపర త్వంచ బ్రహ్మాభ్యాసంవిదుర్బుధాః" అనే న్యాయముగా కాల ము వ్యర్థమును జేయక సర్వదా బ్రహ్మాభ్యాసము సేయుచుం డుటయె ముఖ్యమయినతపస్సు దీనివలన సంసారచింతాజనిత దుఃఖములను దొలంగి శివానందమగ్నమనస్కుడై యుండు నని సర్వవేదాంతసిద్ధాంతతాత్పర్యము॥

ఇతి సర్వవేదాంతసిద్ధాంతసారభూతే
మహాదేవమననే-శివజ్ఞానుభవపురుష తారతమ్యోనామ
త్రయోవింశతి పచ్ఛేద స్సమాప్తః.
పం॥ మల్లికార్జునశాస్త్రిణాపరిష్కృతో౽యం
పరిచ్ఛేదః.

శ్రీశివాయగురవేనమః.

---

శ్రీమహాదేవమననే మహావాక్యనిరూపణం నామ
చతుస్త్రింశతివరిచ్ఛేదప్రారంభః.

---

మహావాక్యార్థవిజ్ఞానం మాయాపాశనికృంతనమ్।
భవేద్యస్మాత్తతస్తేషాం విచారోఽత్ర నిరూప్యతే॥

"అద్వైతమతసిద్ధాంతం శ్లోకార్ధేనవదామ్యహమ్। బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవనేతరః" అన్న పూర్వాచార్యసిద్ధాంతము ననుసరించి వేదచతుష్టయములోను "ప్రజ్ఞానంబ్రహ్మ। అహంబ్రహ్మాస్మి। తత్త్వమసి। అయమాత్మాబ్రహ్మ" అనెడి చతుర్విధవేదాంతవాక్యము" యాంమను జీవబ్రహ్మవాదమే స్థాపించియున్నదని కొందరు చెప్పుదురు. అదెట్లనిన

౧ "ప్రజ్ఞానంబ్రహ్మ" ప్రజ్ఞానమనగా వ్యష్టిశరీరేంద్రియాదులు వాచ్యార్థము తద్ద్రష్టయగు ప్రత్యగాత్మ లక్ష్యార్థము; బ్రహ్మమనగా సమష్టిశరీరేంద్రియాదులు వాచ్యార్థము తద్ద్రష్టయగు పరమాత్మ లక్ష్యార్థము. ౨ "అహంబ్రహ్మాస్మి" అహంశబ్దమునను వ్యష్టిశరీరేం

ద్రియాదులు వాచ్యార్థము తద్ద్రష్టయగు ప్రత్యగాత్మలక్ష్యార్థము - బ్రహ్మశబ్దమునకు సమష్టిశరీరేంద్రియాదులు - వాచ్యార్థము తద్ద్రష్టయగు పరమాత్మలక్ష్యార్థము. 3 "తత్త్వమసి" త్వంపదమునకు వ్యష్టిశరీరేంద్రియాదులు వాచ్యార్థము తద్ద్రష్టయైన కించిద్జ్ఞత్వాదిగుణవిశిష్టుడైన జీవాత్మలక్ష్యార్థము. తత్పదమునకు సమిష్టిశరీరేంద్రియాదులు వాచ్యార్థము. తద్ద్రష్టయై సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టుడయిన పరమాత్మలక్ష్యార్థము. మరియు వ్యష్టిఅవిద్యయనియు సమిష్టిమాయయనియుం జెప్పుదురు. 4 "అయమాత్మాబ్రహ్మ" ఆత్మశబ్దమునకు వ్యష్టిశరీరేంద్రియాదులు వాచ్యార్థము తద్రష్టయగు ప్రత్యగాత్మలక్ష్యార్థము బ్రహ్మశబ్దమునకు సమిష్టిశరీరేంద్రియాదులు వాచ్యార్థము తద్ద్రష్టయగుపరమాత్మలక్ష్యార్థము. వీనలకు "అసి-అస్మి" పదములచే "సోయందేవదత్తః" అనేజహదజహల్లక్షణచేవ్యష్టిసమిష్ట్యాత్మక కార్యకారణాత్మకా విద్యామాయోపాధులను దీసివేసి చిదైకత్వమును జెప్పుదురు. ఇదియేజీవేశ్వరైక్యము. "శ్లో॥ కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః॥ కార్యకారణతాంత్యక్త్వాపూర్ణబోధోవశిష్యతే॥" అను శాస్త్రరీతిగా నీబోధను దెలిసినవారే జీవన్ముక్తులగుదురనియుం జెప్పుదురు. ఇటుల చెప్పుట స్వశాస్త్రమునకే విరుద్ధమెట్లు చెప్పుదురు? అవునెట్లనిన,

ప్రత్యగాత్మకు సచ్చిదానందలక్షణమున్ను, పరమాత్మకు సత్య జ్ఞానానంతాదులు లక్షణమనియును వారుచెప్పుదురు. అందు చిత్తనగా సాధనాంతరనిరపేక్షక స్వయంప్రకాశకత్వమని చెప్పుదురు. "యేనేక్షతే శృణోతీదం జిఘ్రతివ్యాకరోతిచ। స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞానము దీరిత మనే శ్లోకమునందు యేనబహిర్ముఖాంతఃకరణేన ఈక్షతి జిఘ్రతి శృణోతి వ్యాకరోతి అని వారే వ్యాఖ్యానమును వ్రాసియున్నారు. అంతర్బాహ్యేంద్రియసాపేక్షచేతనే ప్రత్యగాత్మకు ఘటాదివిషయజ్ఞానము గలుగుటవల్ల సాధనాంతరనిరపేక్షకస్వయంప్రకాశకత్వ లక్షణము ప్రత్యగాత్మకు సంభవించనందున ప్రత్యగాత్మ బ్రహ్మమూగానట్టు మంకునకైనను తెలియుచున్నది. సమిష్టియైనసర్వ జనులుగూడా సాధనాంతరనిరపేక్షతగా నేత్రదర్శనము చేయక పోవుట సర్వానుభవసిద్ధమై యున్నదిగాన సమిష్టిస్వరూపనియందుగూడా నీదోషము గలుగుచున్నది. "అపాణిపాదో జవనో గ్రహీత్వ పశ్యత్యచక్షుస్స శృణోత్యకర్ణః।" అని శ్వేతాశ్వతరమందును "అపాణిపాదోహమచింత్యశక్తిః పశ్యామ్యచక్షుస్స శృణోమ్యకర్ణః।।" అని కైవల్యమందును సాధనాంతరనిరపేక్షత యాస్వయంప్రకాశత్వమే బ్రహ్మలక్షణమనియే చెప్పుచున్నది. మరియు ముఖ్యార్థబాధయున్నచో లక్ష్యార్థమునుస్వీక

ఱించవలెను. "ఏషసంప్రసాదో౽స్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" అనే శ్రుతులయందును "జలేజలమివన్యస్తం వహ్నావహ్నిరివార్పితం। పరబ్రహ్మణివిజాత్మా నవిభాగేనదృశ్యతే॥" అనే స్మృతులయందును శివానుగ్రహముగలిగిన జీవునికి జలమౌక్తికక్షీరమిశ్రితమరలోహరసాదులయందువలె స్వభావనివృత్తిపూర్వకశివత్వప్రాప్తిలక్షణలేకనే సంభవించునని చెప్పియున్నది. గాన లక్షణావశ్యకమేమియు లేదు. జడమైన శుక్త్యాదులకే తదధికరణంబగు జలాదులను మౌక్తికాది నత్యరూపాంతరప్రాప్తిని పొందించే సామర్థ్యముంచుండగా అఘటనఘటనసామర్థ్యముగల పరశివునికి కించిద్జ్ఞుడైనజీవునిసర్వజ్ఞత్వాద్యసదృశదివ్యమంగళగుణరత్నాకరుడైన తనస్వరూపునిగా జేయుటయొక యాశ్చర్యముకాదు. "శ్లో॥ యస్సర్వజ్ఞస్సర్వవిత్। యస్యజ్ఞానమయం తపః। సత్యకామస్సత్యసంకల్పస్సోన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః॥" అనే శ్రుతులయందును "సర్వజ్ఞతాతృప్తిరనాదిబోధస్స్వతంత్రతానిత్యమలుప్తశక్తిః। అనంతశక్తిశ్చవిభోర్విధిజ్ఞాష్షడాహురంగానిమహేశ్వరస్య॥" అనే శివాగమములయందును పరమేశ్వరుని కీసన్యసాధారణమయిన మహిమచెప్పియున్నది. చతుర్విధమహావాక్యములకే కార్థముగాదు. "ప్రజ్ఞానంబ్రహ్మ"

అనే ఋగ్వేదమహావాక్యము తత్వసిద్ధాంత ప్రదర్శకము "ప్రకృష్టం జ్ఞానం ప్రజ్ఞానవిశిష్టం బ్రహ్మ ప్రజ్ఞాం బ్రహ్మ" ఈ చెప్పుటచేజీవుడు కించిద్జ్ఞుడనియు ఈశ్వరుడు సర్వజ్ఞుడనియు జెప్పబడ్డది. దీనిచే జీవబ్రహ్మలకు వైలక్షణ్యసూచన చేయబడెను. "అహం బ్రహ్మాస్మి" అనే యజుర్వేదవాక్యము స్వానుభవసిద్ధి వాక్యము. "అహం" కించిద్జ్ఞత్వాదిగుణావచ్ఛిన్నుడనైన నేను "బ్రహ్మ" సర్వజ్ఞత్వాదిగుణావచ్ఛిన్నబ్రహ్మను "అస్మి" జపమాలికాదులవలె అయితిని దీననే బ్రహ్మవిద్యామహిమా ప్రదర్శక వాక్యమని కొందరందురు. ఈవాక్యముచే జీవేశ్వరులకు భేదాభేదమును బోధించుచున్నది. "తత్త్వమసి" మహావాక్యము ఉపదేశ మహావాక్యమనబడును. తత్ త్వం అసి "త్వం"పదవాచ్యుడు కించిద్జ్ఞత్వాదిగుణావచ్ఛిన్నుడవైననీవు "తత్" సర్వజ్ఞత్వాదిగుణావచ్ఛిన్న శివరూపుడవు. "అసి" శివోపాసనామహిమచే నదీసముద్రన్యాయముగా శివుడవయితివి. "ప్రసక్తిహి ప్రతిషేధః" అనే న్యాయముగా బూర్వమునందు జీవేశ్వరులకు భేదము సుప్రసిద్ధమై తేనే "అసి-అస్మి" పదములచేనన్నవృత్తి చెప్పియున్నది కాబట్టి దీనిచేతనే ద్వైతాద్వైతము సిద్ధాంతపరచడమైనది. "అయమాత్మా బ్రహ్మ" అనువాక్యము అపరోక్షఫల ప్రదర్శక మహావాక్యమనిపించు

కొనును॥ "అయమాత్మా" ఈజీవుడు "బ్రహ్మ బ్రహ్మస్వ రూపుడాయెను. మరియు "అయమాత్మా" ఈహృదయ పుండరీకస్థిత జీవాంతర్యామియై తన్నియామకమయిన పరమాత్మే-బ్రహ్మా" సర్వపరిపూర్ణ శివుడు "బ్రహ్మాధిపతిబ్రహ్మణోధిపతిబ్రహ్మాశివోమే అస్తుసదాశివోం॥ అనేశ్రుతి శతముల యందు బ్రహ్మశివాది శబ్దములకు హస్తకర పాణిశబ్దములవలె నైకార్థ్యయ వాచకత్వము స్పష్టముగా కనబడుచున్నది. "శ్రు॥ త్యజేధర్మమధర్మంచ ఉభేసత్యానృతేత్యజ। ఉభేసత్యానృతే త్యక్త్వాయేన త్యజసితత్యజ॥" ధర్మాధర్మములును సత్యాసత్యములును శ్రుత్యుక్తరీతిగా వదిలి. ఇన్నిటివద్దిలే మనస్సును గూడా త్యజించవలయును అనగా సర్వము శివస్వరూపముగా నమ్ముజ్జన్యమైన ఘటాదులు మృత్తేకనుక "ఏతస్మాజ్జాయతేప్రాణోమనస్సర్వేంద్రియాణిచ" అనేశ్రుత్యుక్తరీత్యా శివజన్యమాత్రుచే సర్వము శివరూపమే యనేశ్చయించి సంకల్ప వికల్పరహితుడై అయస్కాంతసూచీ న్యాయముగా శివధీన మన

స్ఫూడై యుండవలయునని ప్రకరణ తాత్పర్యము ఇదియే చరమోపదేశము॥

ఇతి- శ్రీమదాపస్తంబసూత్రకౌసికసగోత్రపవిత్రశ్రీపతిపండితారాధ్యవంశసంభూతపండితారాధ్యస్వామికృత సర్వవీరశైవసిద్ధాంతగ్రంథశిరోమణిభూతమహాదేవమనన నామక శ్చతుర్వింశతిపరిచ్ఛేదయుక్తోయం గ్రంథస్సమాప్తః.

తద్భాత్రపుత్రేణ- మల్లికార్జునశాస్త్రిణా

సమ్యక్పరిష్కృతోయంగ్రంథః.

సద్గురుపరబ్రహ్మార్పణమస్తు.

---